# శ్రీ ప్రత్యంగిరా - కృత్యా తంత్రం

**THE ENERGY - WHICH UP LIFTS YOU & DESTROIES ENEMIES**

మంత్ర వ్యాఖ్యానకర్త :

**శ్రీ స్వామి మధుసూదన సరస్వతీ**

**నిజామాబాద్.**



ప్రకాశకులు : ☎ 246 2565

## మోహన్ పబ్లికేషన్స్

**అజంతా హోటల్ ఎదురుగా,**

**కోటగుమ్మం, రాజమహేంద్రవరము-1.**

 **2016** **వెల : 100-00**

# శ్రీ ప్రత్యంగిరా – కృత్యా తంత్రం

**– మధుసూదన సరస్వతీ**

**నిజామాబాద్.** సెల్ : **98499 45066,** 94405 49861



టైటిల్ డిజైన్ :

**ఎన్. లోకేష్**

ప్రకాశకులు :

**మోహన్ పబ్లికేషన్స్**

కోటగుమ్మం, **రాజమహేంద్రవరము – 1.**

**Like us on follow Face book / Mohan publications**
**google play android app / Mohan publications**
**www.granthanidhi.com / *www.mohanpublications.com***
***e-books at :- www.kinige.com newshunt app...***

## అనుబంధం

# పురాణోక్త ప్రత్యంగిర

**వినియోగః**

అస్యశ్రీ అగ్ని పురాణోక్త ప్రత్యంగిరా మహామంత్రస్య, భగవాన్ వేదవ్యాసో ఋషిః, అనుష్టుప్ ఛందః లక్ష్మీరూపిణి ప్రత్యంగిరాదేవతా, సర్వ ఇష్టకామ్యార్థ సిద్ధ్యర్థే వినియోగః ॥

**కరన్యాసః**

శ్రీః సామా మోమా అంగుష్ఠాభ్యాం నమః
సా శ్రీః సానే తర్జనీభ్యాం నమః
యాజ్ఞేజ్ఞేయా నౌసా మధ్యమాభ్యాం నమః
మాయా లీలా లాలీ అనామికాభ్యాం నమః
యామా యాజ్ఞాజ్ఞేయా కనిష్ఠికాభ్యాం నమః
నౌసామాయా కరతలకరపృష్టాభ్యాం నమః

**అంగన్యాసః**

శ్రీః సామా మోమా హృదయాయ నమః
సా శ్రీః సానే శిరసేస్వాహా
యజ్ఞేజ్ఞేయా నౌసా శిఖాయై వషట్
మాయాలీలా లాలీ కవచాయహుం
యామా యాజ్ఞాజ్ఞేయా నేత్రత్రయాయ వౌషట్
నౌసా మాయా అస్త్రాయ ఫట్

**ధ్యానము**

శ్లో॥ **పద్మస్థం పద్మచక్రం చ భృత్యుజిత్ స్వర్గగం ధృతిం**
**శాంతానాం పరమా శాంతిః సౌమ్యా జ్ఞానాది ప్రదాయకం॥**

→

పుస్తకం ముద్రణ పూర్తి అయిన తరువాత ఈ మంత్ర భాగాన్ని వ్యాఖ్యాత పంపిన కారణంగా చివరిలో ముద్రించవలసిన ఈ రెండు పేజీలను అనుబంధంగా ఇక్కడ ఇవ్వడం జరిగినది. పాఠకులు గమనించగలరు. – **మోహన్**

**మంత్రం**

**శ్రీః సోమమోమా సాశ్రీః సానే యాజ్ఞేజ్ఞేయా నౌసా ।**
**మాయా లీలా లాలీ యామా యాజ్ఞే జ్ఞేయా నౌసా మాయా॥**

**సాధనఫలం**

పై రకంగా న్యాసాలు చేసి ప్రత్యంగిరను లక్ష్మీ స్వరూపిణిగా ధ్యానించి సాధనచేసే వారికి అన్ని కార్యాలు సిద్ధిస్తాయి. ధనప్రాప్తికలుగుతుంది. త్వరలోనే ఈ మాయా సంసారాన్ని తరిస్తారు. లక్షా 25 వేల జపం 11 రోజులలో ముగించి తేనె, చెరుకుగడ, వరిపేలాలు, బెల్లం, కొబ్బరి, పాయసాన్నంతో దశాంశహోమం చేస్తే కుబేరుడితో సమానంగా ధనవంతులౌతారు.

ప్రయోగం – మధ్య వర్తులంలో త్రికోణం తరువాత ఆవరణలో 4,8,16,32 దళాలను ఒకదాని తరువాత ఒకటి గోరోచనం, కుంకుమపువ్వు, అష్టగంధం, కుంకుమ, ఎఱ్ఱచందలాలతో భోజపత్రం మీదదించి మూల మంత్రానికి ముందు "ఓం హూం ఫట్" చివర వషట్ చేర్చి యంత్రంలో వ్రాయాలి. ఉత్తర దిశలో ఓం హం సః అని వ్రాయాలి. మూలలలో, లక్ష్మి, శివ, పాపరాక్షసి పేర్లువ్రాయాలి. ప్రాణప్రతిష్ఠ చేసి యంత్రాన్ని అర్చించి జపంచేస్తే త్వరగా సిద్ధిస్తుంది. శత్రుబాధ తీరి బంధ విముక్తి కలుగుతుంది.

**కాళీ ప్రత్యంగిర**

**మంత్రం – క్రీం సః హు (అముకం) నామాయ ఫట్ హ్రీం హ్రీం హ్రీం**

కాగితంపీతపై మంత్రం వ్రాసి "అముకం" స్థానంలో మీ శత్రువుపేరు వ్రాసి ఆ కాగితాన్ని పూజించి పై మంత్రాన్ని 1008 సార్లు జపిస్తే శత్రుబాధ తొలగిపోతుంది. పాముకాటు, తేలుకాటు వల్ల మూర్ఛిల్లిన వ్యక్తి చెవిలో ఈ మంత్రం (సిద్ధించు కొన్నవారు) చెబితే విషం విరిగిపోతుంది.

## విషయసూచిక





# ముందుమాట

పూర్వకల్పాలలో దేవదానవులకు యుద్ధం జరిగినప్పుడు, దేవతలు ఓడిపోయారు. శ్రీమన్నారాయణుడి సుదర్శనం కూడా వ్యర్థం అయింది. ఇక ఆదిపరాశక్తే దిక్కని గ్రహించిన పరమశివుడు శత్రుసంహారం కొరకు అంబను స్మరించగా ఆవిడ ఆవిర్భవించి దానవ సంహారం చేసింది. ఆ తల్లి ఒక్కొక్క దేవతకు ఒక ప్రత్యేక రూపంలో మొత్తం 64 రూపాలలో దర్శనమిచ్చింది. ప్రతిపక్ష నాశిని, ప్రతి మంత్ర భక్షిణి అవడంవల్ల ఆవిడ "ప్రత్యంగిర" అని, చేయబడింది కనుక "కృత్య" అని, అథర్వణ మంత్రాలలో అర్చించబడేది కనుక "అథర్వణ భద్రకాళి" అని, లోన నిలిచి బాగా రక్షించేది కనుక, శత్రువులకు ఊపిరాడకుండా చేసేది కనుక "నికుంభిల" అని పిలువబడింది. అనులోమంలో "జాతవేదసిదుర్గా" మంత్రంగాను, విలోమంలో "ఆగ్నేయాస్త్రం"" గానూ ప్రతిలోమ విధానంలో "దుర్గా కృత్య" గానూ "జాతవేదసేసునవామ" అనే మంత్రం పేర్కొనబడింది. శివుడు దర్శించిన కృత్య శివకృత్యగానూ, బ్రహ్మ దర్శించినది బ్రహ్మ కృత్యగానూ, విష్ణువు దర్శించినది "నారాయణి ప్రత్యంగిర" గానూ పిలవబడ్డాయి. వైష్ణవ దేవతలు దర్శించిన మంత్రాలు ప్రత్యంగిరలని, శైవదేవతలు దర్శించినవి కృత్యలని ఒక తాంత్రికుడు నాకు వివరణ నిచ్చాడు. దీనికి ప్రమాణం ఎక్కడ ఉందో వెతకాలి?

కేవలం త్రయీ వేదాలనే ఒప్పుకునే వారికి ప్రత్యంగిర – కృత్యాదులు మొత్తం అన్నీ తాంత్రికాలే. అథర్వణాన్ని వేదంగా ఒప్పుకునేవారికి మాత్రం ఈ ప్రకరణం ఇటు వైదీకము అటు తాంత్రికము కూడా అవుతుంది. ఈ గ్రంథ మంత్ర వ్యాఖ్యాత, సంకలకర్తకు మాత్రం వేదము, తంత్రం రెండు వేరుగా ఏనాడూ కనపడలేదు. అందుకే ఒకవైపు వేదసూక్తాలను వివరిస్తూ, మరోవైపు తాంత్రిక గ్రంథాలు రచిస్తూ కనిపిస్తాడు. అథర్వణ వేద, శౌనక సంహితలో 10 కాండాలలో దాదాపు 39 సూక్తాలలో, పిప్పిలాదశాఖలో ఈ మంత్రాలు కనిపిస్తాయి. వీటి ప్రయోగ విధానాలు నారద తంత్రంలో ఉన్నాయి. మంత్రాలు ఏవైనా అభిచార కర్మలకు (ప్రతీకారంలో, ద్వేషంలో ఇతరులకు హాని చేసే సంకల్పంతో చేసే ప్రయోగాలు) వాడినప్పుడు దూషనీయాలై, శాంతి, పౌష్టిక కర్మలకు (గ్రహ, పాప శాంతి మొ॥, శారీరిక మానసిక పుష్టి కొరకు అంటే ధర్మబద్ధ కామం, అర్థప్రాప్తి, ఆరోగ్యం కొరకు చేసే ప్రయోగాలు) వాడినప్పుడు భూషణాలై నిలుస్తాయి.

**ఆగ్నేయాస్త్ర మితి ప్రోక్తం విలోమప్రథితో మనుః ।**
**పూర్వోక్తా ఏవ మున్యాద్యాః షడంగాని విలోమతః ॥**

**అతి దుర్గేయ మత్యాద్యా షదంతా త్రిష్టు బీరితా ।**
**అతిదుర్గా మనుశ్చాయం యద్దినాస్త్రమితీర్యతే ॥**

**ప్రతిలోమ మిమం మంత్రం కృత్యాస్త్రం పరిచక్షతే ।**
**దుర్వర్ణాంతాథ గాణ్యాద్యా గాణిదుర్గా సమీరితా ॥**

**విశ్వాద్యా ణ్యక్షరాంతా సా విశ్వదుర్గా సమీరితా ।**
**సింధ్వాద్యా నావకారాంతా సింధుదుర్గా నిగద్యతే ॥**

ఈ పై శాస్త్ర ప్రమాణాన్ని ఆధారంగా చేసుకొని "దుర్గా తంత్రం" లో అతి దుర్గా (దినాస్త్రం), గాణిదుర్గా, విశ్వదుర్గా, సింధుదుర్గా మంత్రాలు వివరించబడ్డాయి. ఇక ఇప్పుడు ఈ కృత్యా - ప్రత్యంగిరా ప్రకరణంలో ఆగ్నేయాస్త్రం, దుర్గా కృత్య ఇస్తున్నాము.

ప్రత్యంగిరలు, కృత్యలు కొన్ని ఋగ్వేద పరిశిష్ఠంలో కూడా కనిపిస్తాయి. బృహత్కృత్య, వేదాత్మప్రత్యంగిర (బ్రహ్మకృత్య) మొదలైనవి ఋగ్వేదంలోవే సస్వరమైన ఈ వేద మంత్రాలను గురుముఖతః అధ్యయనం చేస్తున్నవారు ఎంతో మంది ఉన్నారు. అనేక కృత్యలు ప్రత్యంగిరలు సమాహారంగా చేయబడి శ్రీవనదుర్గా మహావిద్య అనే పేరుతో, ప్రత్యంగిరా ఋక్ పారాయణ క్రమం అనే పేరుతో రుద్రయామంలో కనిపిస్తాయి. (ప్రత్యంగిరా ఋక్ పారాయణ క్రమం విపులంగా ఇస్తున్నాము.)

కొన్ని కృత్యలు (శివకృత్యాదులు) సిద్ధించుకునే తాంత్రిక విధానాలు, వాటి ప్రయోగ విధానాలు, అలాగే కొన్ని ప్రత్యంగిరా మంత్ర తాంత్రిక విధానాలు ప్రయోగ విధానాలు ఈ గ్రంథంలో ఇచ్చాము. తంత్ర సాధన విధానము గానీ, ప్రయోగ విధానాలు గానీ అంగన్యాస కరన్యాసాలు కలిగిన కొన్ని మంత్రాలకు ఇవ్వలేదు. వాటి సంగతి ఏమిటి? ఏ ఒక్క ప్రత్యంగిరా మంత్రానికైౖ ఇచ్చిన సాధన విధానాలు, ఫలితాలు అన్ని ప్రత్యంగిరలకు వర్తిస్తాయి. అలాగే కృత్యల విషయం కూడా.

తాంత్రిక సంప్రదాయంలో పంచకాళికా విద్య ఒకటి. 1. ప్రత్యంగిర 2. అధర్వణ భద్రకాళి 3. శరభకాళి 4. దక్షిణ కాళి 5. తారా - ఇవే పంచకాళికలు. ఇదే క్రమంలో వీటికి సాధన చేయడం సంప్రదాయం. ఈ గ్రంథం ప్రత్యంగిరా - కృత్యలకు

మాత్రమే పరిమితమైనందున మొదటి రెండు మంత్రాలు వాటి సాధన విధానాలు మాత్రమే. ఇక్కడ ఇవ్వడం జరిగింది. దశమహావిద్యా తంత్రం, శాక్తేయంతంత్రం అనే పేర్లతో రాబోతున్న తక్కిన గ్రంథాలలో మిగతా మూడు విద్యలు ఇవ్వడం జరుగుతుంది.

నేను శ్రీవిద్యా కృత్యను నిర్మించినప్పుడు దానిని ఒక తాంత్రికుడు చూచి సాత్వికమైన బ్రహ్మకృత్య ఎక్కడ ఉగ్రమైన శివ, విష్ణు కృత్యలెక్కడ అని, అవి ఏ విధంగా కలుస్తాయి అన్నారు. మద్గురుదేవులు శ్రీనిఖిలేశ్వరానంద స్వామివారు (శ్రీనారాయణదత్త శ్రీమాలి) నిర్మించిన దశమహావిద్యా మంత్రాన్ని మా గురుభాయి అయిన ఆతాంత్రికుడు జపించలేదా? 6 ఉగ్రవిద్యలు 4 సాత్విక విద్యలు ఎలా కలిసి ఏకమైనాయి? దత్తరూపంలో త్రిగుణాలకు అధిష్టాతలైన త్రిమూర్తులు ఎలా కలిసి పోయారు? ఇంకా సాధకస్తితిలో ఉన్న మనలో మాత్రం ఈ మూడు కోణాలు కలిసిలేవా? అసలు అనుభవాన్ని మించిన జ్ఞానం ఎక్కడ ఉంది? నేను ఎన్నోసార్లు తంత్ర ప్రయోగాలను వెనక్కు తిప్పడానికి, భూతప్రేతాలను ఎదుర్కోవడానికి, శ్రీవిద్యా కృత్యను ఉపయోగించి విజయాన్ని పొందాను. ఇందులో సందేహం ఏమీలేదు.

“నికుంభిలగా” పిలవబడ్డ ఈ విద్యను ఇంద్రజిత్తు వాడేవాడని రామాయణంలో కనిపిస్తుంది. యుద్ధానికి వెళ్లేముందు జంతుబలులు ఇస్తూ అతడు ఈ ప్రత్యంగిరా హవనం చేసి అజేయుడై యుద్ధభూమికి వెళ్ళి, యుద్ధంలో యముడిలాగా విజృంభించి శత్రుసంహారం చేస్తాడని, కనుక ప్రస్తుతం అతడు చేస్తూన్న యజ్ఞంలో విఘ్నం కలిగించమని విభీషణుడు చెప్పగా వానరులు వెళ్ళి అతడి యజ్ఞాన్ని ధ్వంసం చేశారని, అలా పూర్తికాని యజ్ఞం నుండే యుద్ధానికి తరలి వచ్చాడు కనుక అతడిని సంహరించడం లక్ష్మణుడికి సాధ్యం అయిందని రామాయణంలో వ్రాయబడింది. ఇక ఇంతకన్నా విశ్లేషణలు నేనేమి ఇవ్వగలను? అనేకసార్లు ప్రత్యంగిరా బుక్ యజ్ఞం చేసి నేనుకూడా అనేక మందికి తమ పనులు సాధించి పెట్టాను. మా గురు దేవులను స్మరించి వారి ప్రసాదంగా అందుకో బడుతున్న ఈ తంత్ర గ్రంథాన్ని శ్రద్ధా భక్తులతో, ఏకాగ్రత చిత్తంతో, చిత్తశుద్ధితో కేవలం మీ విజయం మీద ఆత్మ రక్షణమీద మాత్రమే మనసు నిలిపి, పాపచింతన అన్యులహాని లేకుండా ఈ సాధనలు చేసిన వారికి తప్పక శుభఫలితం లభించగలదు.

అస్త్ర విద్యలలో కెల్లా శ్రేష్ఠమైంది సుదర్శనచక్రాస్త్రం, శాపగ్రస్తమైన ఈ చక్రాధిష్టాన దేవత కార్తవీర్యార్జుడినిగా (సహస్ర బాహువు) ప్రసిద్ధికెక్కారు. కార్త వీర్యార్జుడిని కన్నా ఏ శాపములేని సుదర్శనాస్త్రమే సర్వశ్రేష్ఠమైంది. కానీ ఆ అస్త్రం కూడా వ్యర్థమైనప్పుడు

ప్రతిమంత్రభక్షిణి అయిన ప్రత్యంగిర కార్యాన్వితమైంది. కనుక ఇదే సర్వ శ్రేష్ఠమైంది అని గ్రహించాలి.

పిప్పలాద శాఖీయమైన పరిశిష్టంలోని ప్రత్యంగిరా ఋక్ సూక్తం గురించి మరో గొప్ప విషయం మనకు పెద్దలు చెప్పారు. కలియుగంలో లోభులైన గురువులు డబ్బుతీసుకొని అయోగ్యులైన శిష్యులకు దీక్షనిస్తూ, డబ్బులేని యోగ్య శిష్యులను దూరంగా ఉంచడంవల్ల యోగ్యత లేనివారు మంత్రాలు గ్రహించి వాటి ప్రభావాన్ని తట్టుకోలేక వాటిని విడిచి పాపం చేసినవారు అవుతున్నారు. అలాగే యోగ్యులు గ్రంధాల నుండి మంత్రాలను సేకరించి అనుష్ఠించి గురువు అనుమతి లేకనే సాధన చేసిన పాపానికిలోనౌతున్నారు. ఈ పాపాన్ని పోగొట్టుకోవడానికి ప్రత్యంగిరను భజించాలి.

శ్రీదేవీ భాగవతం, సూత సంహిత, మహాకాల సంహితలలో చెప్పిన దాని ప్రకారం వేద విరోధంకాని తంత్రాలను వేదాలతో సమానంగా ప్రమాణంగా స్వీకరించాలని ఉంది కనుక, మేము ప్రత్యంగిరను ప్రమాణంగా తీసుకుంటున్నాము అంటారు వైదకులు. కానీ వేదాలలో ఉన్నవి ఏమిటి?వేదాధ్యయనం (వేదమంత్రాల పారాయణం) నిష్కామ కర్మ, పవిత్రమైన ధర్మమార్గ జీవనం. కాని ధర్మబద్ధమైన కోరికలు తీరకపోతే? కేవలం పూర్వజన్మలకు కర్మల ఫలితంగా వచ్చిన ప్రారబ్ధంగా ఈ జీవితాన్ని స్వీకరించి బాధపడుతూ, నలుగుతూ బ్రతకడమేనా మరి పరమపురుషుడి నుండి ఉత్పనమైన ఈ జీవులకు పురుషార్థం లేదా? యత్నం విడనాడాలా? ప్రారబ్ధంకూడా ఒకప్పటి తమ కర్మ జనితమే కదా దానికి కర్త తానే అయినప్పుడు దానిని ధ్వసం చేయడానికి తానెందుకు ప్రయత్నించకూడదు? అలా ప్రయత్నం చేయడమే తంత్రం.

అసలు విగ్రహారాధన, మంత్రానుష్ఠానాలు, కామ్య కర్మలు (అవి వైదీక మంత్రాలతో చేసినా) అన్నీ తంత్రాలే అవుతాయి. తంత్రం అంటే ప్రక్రియ అని అర్థం-ప్రక్రియ లేవీ వేదంలో లేవు. ఇవి లేకుండా జీవికి మనుగడ లేదు. శ్రీ గురు దేవుల ఈ భావనలను మీముందు ఉంచడానికి నేను చేస్తున్న రెండవ ప్రయత్నమే ఈ గ్రంథం.

**"బహు జన సుఖాయ, బహు జన హితాయ"**

17-03-2004 ( శ్రీ స్వభాను నామ సం॥ ఫాల్గుణ బహుళ ఏకాదశి)

నిజామాబాద్ బుధవారం

***- స్వామీ మధుసూదన సరస్వతి***

# ఒక్క మాట...!

శ్రీ శివ సంకల్పం నుండి పుట్టిన ప్రత్యంగిర శివమానసపుత్రిక. ఈమే తంత్రగాయత్రీ, ఈవిడే త్రిశక్తి సమన్విత దుర్గ. స్త్రీలు తమ మాసధర్మాలు సరిచేసుకోవడం కొరకు ఈ సాధనలు ఆచరించవచ్చు. సముద్ర తీరాలలో, అరణ్య భూములలో, కొండలలో ఈ సాధనలు త్వరగా సిద్ధిస్తాయి. వామ తాంత్రికులు ఈవిడను పంచమకార మార్గంలో, శ్మశానాలలో అర్చిస్తారు. నింద్య నీయమైన ఈ మార్గాలను విడనాడి, ఈ అమ్మను సాత్వికమార్గాలలోనే ఆత్మ రక్షణ కొరకు, సుఖ భోగప్రాప్తి కొరకు (ధర్మమార్గలలో) ముక్తి కొరకు అర్చించాలి అనేది పెద్దల నిర్ణయం. ప్రత్యంగిరా హవనాలు, సాధనలు, అష్టమి, పౌర్ణమి, అమావాస్యలలో ఎక్కువగా ఆచరిస్తారు. వనదుర్గ, ప్రత్యంగిర ఇరువురూ ఒకరే అనేది ఈ మంత్ర వ్యాఖ్యాత దర్శనం. నదీ గర్భాలలో త్వరగా ఈ విద్య సిద్ధిస్తుంది అనేది అనేక మంది తాంత్రికుల అనుభవం. ఈవిడ కదంబ వృక్షంలో నివసిస్తుంది. కనుక ఆ చెట్టుక్రింద ఈవిడ మంత్రం త్వరగా సిద్ధిస్తుంది. ఈ సాధన చేసేవారు మీసం గొరిగించుకొని, ముఖానికి కాళ్ళకు పసుపు రాసుకొని, అరటిఆకులో ఏకభుక్తం చేస్తూ, మంత్ర సిద్ధిపొందవచ్చు. జరాసంధుడు ఈవిడను గదాధరిగానూ, ఛిన్నమస్తగానూ సిద్ధించుకున్నాడు. అన్ని నదులకన్నా గంగానదీ గర్భలో గానీ, గోదావరీ గర్భంలోగానీ ప్రత్యంగిర త్వరగా సిద్ధిస్తుంది. కృష్ణుడు ఈ అమ్మను కన్యకా పరమేశ్వరిగా, నారాయణిగా (నారాయణి ప్రత్యంగిరగా) సిద్ధించుకున్నాడు. గోకులానికి ఈవిడే ఇష్టదేవత. కనుక ఈవిడను అర్చించిన వారికి గోసంపద వృద్ధి పొందుతుంది. ఘంటా కర్ణుడనే రాక్షసుడు ఈవిడను "చంద్రఘంట" అనే రూపంలో (నవదుర్గలలో ఈవిడ మూడవది) సిద్ధించుకొని, ఆవిడకోరికపై ఆవిడను కర్ణాభరణంగా ధరించాడు. కనుకే ఇతడికి ఘంటాకర్ణుడనే పేరు వచ్చింది. తంత్రాలలో అంజనసిద్ధికి ఈవిడే అధిష్ఠాన దేవత అని చెప్పబడింది. మరోచోట చిత్తవృత్తులను కదిలించే చేతనగా ఈవిడ చప్పబడింది. మానసాదేవి రూపంలో హరిద్వారంలో కొండమీద ఈవిడ పూజలందు కుంటున్నది.

ఈవిడను ఉపాసించే సాధకులను వారికి తెలియకుండానే వారి ఛాయా రూపంలో వెంట ఉండి కాపాడుతుంది. కొందరు ఈవిడను గుమ్మడి పూలతో అర్చించడంకద్దు. అల్లనేరేడు పండ్లను ఈవిడకు నైవేద్యముగా పెడతారు.

ఈవిడకు గుడి కడితే ఢక్కా (డోలు) నాదం ఆ గుడిలో నిరంతరం వినబడేట్టు చేయాలి అంటారు పెద్దలు. న్యాయ స్థానాలలో కండ్లకు గంతలు కట్టబడి చేతిలో త్రాసు ఉండే దేవత ఈవిడే. అంటే ఆధర్మాన్ని ఖండించడం, అధర్మాత్ములను దండించడం ఈవిడ చేసేపని. నందుడి ఇంట పుట్టి వసుదేవుని కారాగారానికిచేరి, కంసుడికి,

ఎనిమిది భుజాలతో దర్శనమిచ్చిన ప్రత్యంగిర ఈవిడే. నర్మదా నదీ రూపంలోనూ, యమసోదరి యమునా నదీరూపంలోనూ ఈ భూమిామీద ప్రవహిస్తున్నది ఆతల్లి. నగ్నరూపంలో తాంత్రికుల చేత పూజించబడే ఈవిడ నిగమాచారులచేత రుక్కులతో అర్చించబడుతోంది. పున్నాగ చెట్టు పుష్పించే ఋతువులో, ఆ చెట్టుక్రింద సాధన చేసిన వారికి ఈవిడ తర్వగా సిద్ధిస్తుంది.

భరద్వాజ మహర్షి ఈవిడ అంశలోనే జన్మించాడు. శాక్తేయ దర్శనాల ప్రకారం ఈవిడ మూలాధార నివాసిని. వంధ్యా స్త్రీలు ( సంతానంలేని స్త్రీలు) ఈవిడనారాధించి సంతానం పొందుతారు. మహామారి (అమ్మవారి) రూపంలో ఆవేశించే ఈవిడను అధర్వణ భద్రకాళి మంత్రాలతో శాంతింపచేస్తారు. మొలకెత్తించిన యవలు ఈవిడకు నైవేద్యంగా పెడతారు. అసలు ఈ విద్య హైందవవిద్య కాదని యవనుల నుండి వచ్చిందని కొందరు చరిత్రకారులు అపోహపడతారు. ప్రపంచగ్రంథ సముదాయాలలోకెల్లా అత్యంత ప్రాచీనమైనదిగా ఒప్పుకోబడే ఋగ్వేదంలోనే ఈవిడ మంత్రాలు కన్పిపిస్తాయి. గనుక, ఇది వేద విద్యనే అని చెప్పవచ్చు. ఈవిడ వేదవిద్య అయినా "నిరూఢ పశుబంధ" యజ్ఞాలలో యూపస్తంభాన్ని (పశువును తాటితో కట్టి ఉంచే కొయ్య) ఆశ్రయించి బలులు స్వీకరిస్తుంది. అందుకే శ్రీచక్రంలోని బలిదేవత ఈవిడేనని చెప్పవచ్చును.

అరణ్యవాసం చేసిన శ్రీరాముడు, నలుడు, పాండవులు ఈమెనారాధించి తిరిగి రాజ్యాలు పొందారట. ఈవిడ రాగిణీవిద్యలకు, హృదయానికి అధిష్ఠాత్రిఅని చెప్పబడింది. కనుక గుండెనొప్పి వచ్చినవారు ఈవిడనారాధించి స్వస్తులు కావచ్చు. రోదసిలో ఒక గ్రహం రూపంలో కూడా ప్రత్యంగిర నిలిచి ఉన్నది ఉంటాయి తంత్రాలు.

ఈవిడ ఆరాధనలో కారాగార బంధాన్ని తెంచుకున్న వారు ఎందరో ఉన్నారు. ప్రత్యంగిరా సాధనలో ఏలినాటిశని దోషం తొలగిపోతుంది. శని వాడే శంఖం ప్రత్యంగిర అని పిలవబడుతుంది. హోలి రోజు హోలికాగ్ని రూపంలో అర్చించబడేది ప్రత్యంగిర, ఈవిడే లోపా ముద్రగా ఈ భూమిమీద అవతరించింది.

నేను ప్రత్యంగిరా తంత్రం వ్రాస్తున్నప్పుడు ఈ పేరు అసలు జీవితంలో ఎప్పుడు విననివారే చాలా మంది కనిపించారు. వారికొరకు నాకు తెలిసినన్ని వివరాలు ఇక్కడ పొందు పరచడం జరిగింది. ఇది సాధనకు ప్రాధాన్యతనిచ్చిన తంత్ర గ్రంథం. పరిశోధనాత్మక గ్రంథం కాదు, కనుక ప్రత్యంగిర పుట్టు పూర్వోత్తరాలు విశ్లేషించ వలసిన పని నాకు లేదు. నేను అందించిన ఈ వివరణ వల్ల సాధనలకు శ్రీ ప్రత్యంగిరలో శ్రద్ధ, భక్తి పెరిగితే నేను ధన్యుడిని...

**మధుసూదన సరస్వతి**

08-05-04, **విజయవాడ.**

# ప్రత్యంగిర కృత్య తంత్రం - ప్రయోజనలు

**1. ప్రత్యంగిర ఉపాస ఎందుకు చేయాలి?**

ప్రత్యంగిర సనాతనమైన ఋగ్వేదీయశక్తి. ఇది పరిశిష్టాలలో ఉన్నది. (పరిశిష్టం అంటే మిగిలిన ముక్క అని అర్థం) కనుక ఈ శక్తిని అథర్వణ విద్యగా పేర్కొంటారు. (ఋగ్, సామ, యజుర్వేదాలలో మిగిలిన ముక్కలన్నీ కలిసి అథర్వణవేదంగా పేర్కొన బడతాయి.) వేదకాలం నుండి ఈ ఉపాసన కొనసాగుతున్నది. విశ్వామిత్రాది ఋషులు ఈ శక్తిని ఉపాసించారు. అయితే దివ్యమైన సుదర్శన, నారాయణ, పాశుపత, బ్రహ్మ మొదలైన అస్త్రాల యొక్క పిశాచరూపం గనుక వేదమార్గవలంబులు అనుష్ఠించకూడదు అని కొందరంటారు. కానీ నేను నా స్వీయానుభవంతో పెద్దల గురువుల అనుమతితో ఉపాశిస్తున్నాను, దీని నుండి లాభం పొందుతున్నాను. వనదుర్గను ఆత్మరక్షణ కొరకు, ప్రత్యంగిరను శతృసంహారం కొరకు అనుష్ఠిస్తారు. మనలోనే దాక్కొని మనలను పతనం చేసేవి, సుఖాన్ని ఇస్తున్నట్టుగా నటిస్తూ దుఃఖాన్ని ఇచ్చేవి అయిన కామం క్రోధం మొదలైన శతృవులను సంహరించడానికి కూడా ఈ విద్య ఉపయోగపడుతుంది. కొందరు మాకు లోపలగానీ బైటగానీ శత్రువులు లేరు అన్న తరువాత ఈ విద్యను ప్రయోగిస్తే వారికి తెలియకుండానే వారికి ఉన్న శతృవులు నశించడం మేము ఎరుగుదుము. ఈ విద్యను ధనప్రాప్తికి ఉపయోగించడం మనకు పురాణాలలో కనిపిస్తుంది. (ఈ పురాణ విద్యను అనుబంధంగా ఇస్తున్నాము) ఈ విద్యానుష్ఠానంలో ఆరోగ్యాన్ని పొందినవారు ఎందరో ఉన్నారు.

**2. ప్రత్యంగిర ఉపాసన ఎవరు చేయాలి?**

ధనం కావలసినవారు, ఆరోగ్యాన్ని కోరుకునేవారు, అప్పుల పాలైనవారు, సంతానంలేనివారు, వివాహంకానివారు లేదా వేదవిద్యలలో శ్రద్ధ ఉన్నవారు ఎవరైనా ఈ విద్యనుపాసించవచ్చు.

**3. ప్రత్యంగిర ఉపాసన ఎప్పుడు చేయాలి? ఆయా తిథులు, వారాలు, నక్షత్రాలు వివరించండి?**

ఉపాసన అంటే ఈ విద్య (శక్తి) వద్దకు వెళ్ళి కూర్చోవడం అని అర్థం. అంటే రోజూ నియమం తప్పకుండా జీవితాంతం ఉపాసించాలి. నియమం తప్పక ప్రతి అమావాస్య పౌర్ణిమలకు రాత్రి సమయంలో హవనం చేయాలి. ఆయా కోరికలు,

అవసరాలు, ఎప్పుడు కలుగుతే అప్పుడే ప్రత్యంగిరా ప్రయోగాలు చేయవచ్చు. ఆయా విద్యలను ప్రత్యేక ముహూర్తాలు, తిథులు, ఆ ప్రయోగాలు అనుష్టానాలు ఎక్కడ తెలిపామో అక్కడే ఈ గ్రంథములో వివరించాము.

**4. ప్రత్యంగిర ఉపాసన ఎలా చేయాలి?**

ప్రత్యంగిలు, కృత్యలు అనేకం ఉన్నాయి. ఒక్కొక్క విద్యకు ఒక్కొక్క రకమైన విధానాలు, పద్ధతులు, ఉన్నాయి. విధానం చెప్పకుండా వదిలిన విద్యలను ఏదైనా అమావాస్య, పౌర్ణమి, అష్టమి, చవితిలో మొదలుబెట్టి సిద్ధికొరకు 11 రోజులు లేదా 21 రోజులలో రాత్రిపూట పశ్చిమ ముఖంగా లేదా, తూర్పుముఖంగా కూర్చొని నల్లని ఆసనం మీద నల్లని వస్త్రం ధరించి అఖండ దీపం వెలిగించి మొత్తం 1లక్షా 25వేలు మంత్ర జపం, నల్లని హకీక్‌మాలతో గానీ, రుద్రాక్షమాలతో గానీ జపించాలి. (కేవలం నారాయణిప్రత్యంగిరకు తులసీమాల ఉపయోగించవచ్చు.)

**5. ప్రత్యంగిర ఉపాసన బెడిసికొట్టిన సందర్భాలు ఉన్నాయా?**

ఏ ఉపాసనా బెడిసికొట్టదు. ఏదైనా విద్య మంచి చేయకపోగా చెడు చేసింది అంటే దాన్ని అనుష్ఠించే సాధకుడు నియమాలు సరిగ్గా పాటించ లేదని గ్రహించండి. అయితే నా స్వీయానుభవం ఒకటి వ్రాస్తాను ఒకసారి నేను విజయవాడలో కొందరు ప్రత్యంగిరా, వనదుర్గా ఉపాసకుల కొరకు ప్రత్యంగిరా ప్రయోగం-ఎ (పేజీ నెం. 35) తో బాటుగా హవనం చేస్తే వారికి మంచి జరగక పోగా చెడు జరిగింది. నేను ఈ విషయం అమ్మవారిని అడిగితే కుసంస్కారాలను, దుష్టులను, కుబుద్ధులను అంతం చేయమనేగదరా నువ్వు సంకల్పించింది నేను అదే చేశాను అన్నది. మేధావులు, విజ్ఞులు అయిన పాఠకులకు ఇంతకన్నా ఎక్కువగా వివరించవలసిన పనిలేదు.

**6. ప్రత్యంగిర ఉపాసన ఫలించిన సందర్భాలు (స్వీయనుభవం) వివరించండి?**

బస్సులలోనూ రైళ్ళలోనూ నేను చాలాసార్లు గంటలకొద్దీ నిలబడి ప్రయాణించ వలసినవచ్చేది. ఈ ఉపాసన ప్రారంభించిన తరువాత ఆ పరిస్థితి కనీసం ఒక్కసారి కూడా కలగలేదు. ఇంతకుముందు ఉన్న దయనీయమైన ఆర్థికపరిస్థితి నాకు ఇప్పుడు లేదు. అమ్మదయతో నలుగురికి పెట్టగలుగు తున్నాను. నాలోని కుసంస్కారము కామక్రోధాలు అదుపులో ఉన్నాయి. ఈ ఉపాసన ప్రారంభించిన తరువాత అనారోగ్యం పాలైన సంఘటనలు ఒకటి రెండు మినహాయించి పెద్దగా లేవు. ఆ ఒకటి రెండు సార్లుకూడా వెంటనే కోలుకోగలిగాను. ఇంతెందుకు ఆదిపూడి సాయిరామ్ మీ సాయిపీఠంలో గుంటూరులో ఈ హవనం ఒకసారి చేసినందువల్ల ఎంతో లాభ పడ్డాడు.

**7. ప్రత్యంగిర ఉపాసన ఇళ్ళలో చేయవచ్చా? ఆడవాళ్ళు ఉండవచ్చా? గుడిలో చేయాలా?**

ప్రత్యంగిర బుక్‌పారాయణం ఇండ్లలో చేసుకోవచ్చు. శుచిశుభ్రం, మడిఆచారం పాటించాలి. ప్రత్యంగిరా మందిరాలు తక్కువగా ఉన్నాయి. శ్రీ సిద్ధేశ్వరానందస్వామివారు అనుమతిస్తే వారి సిద్ధకాళీపీఠం (గుంటూరు) కుర్తాళం సిద్దేశ్వరాపీఠం, విశాఖపట్టణ లలితాపీఠంలో ఆపీఠాధిపతి అనుమతితో చేసుకోండి. లేదా ఏశాక్తేయ (అమ్మవారి) మందిరంలోనైనా చేసుకోవచ్చును. ప్రత్యేకంగా సాధనకు ఒక గది ఉంటేనే అక్కడ రాత్రిపూట జపం, హోమం చేసుకోవచ్చు.

**8. ప్రత్యంగిర ఉపాసనకు కావలసిన వస్తువులు ఏమిటి?**

బుక్ పారాయణానికి ఏ వస్తువులు అవసరం లేదు ఉపాసనకు యంత్ర (కృత్య, ప్రత్యంగిర, తాంత్రోక్త యంత్రాలు) కృత్య ప్రత్యంగిర మాలలు "మంత్ర తంత్ర యంత్ర విజ్ఞాన్, డా॥ శ్రీమాలామార్గ్, హయికోర్ట్ కాలనీ, జోధ్‌పూర్, (రాజస్థాన్) లేదా సిద్ధాశ్రమ్, 306 కోహాట్ ఎన్‌క్లేవ్, పీతమ్‌పూర్, న్యూఢిల్లీ-34. ఫోన్ : 011-71822248, ఫ్యాక్స్ : 011-7196700" కు వ్రాసి తెప్పించు కోవచ్చు. (ఉత్తరాలు హిందీ, లేదా ఇంగ్లీషులో వ్రాయాలి.)

**9. ప్రత్యంగిర ఉపాసనలో పాటించవలసిన నియమాలు, ఏమిటి?**

ఆయా సాధనలు వివరించినప్పుడు నియమాలు, నిబంధనలు, తీసుకోవలసిన జాగ్రత్తలు చేయగూడని పనులు అన్నీ వివరించాము. వీటిన్నిటి కన్నా ముఖ్యమైనది- దయచేసి మనస్సును పవిత్రంగా ఉంచుకోండి, ఎవరి హానిని కోరి మీరు సాధన చేయకండి - ధర్మబద్ధమైన మీ కోరికలు, అవసరాలు తీరాలని సంకల్పించి సాధన చేయండి. మిమ్ముల్ని ప్రత్యంగిరామాత కాపాడుతుంది. అనుగ్రహిస్తుంది.

**10. ప్రత్యంగిరా హవనంలో ఏయే పదార్థాలు వాడతారు?**

ఏదైనా ప్రత్యంగిరా కృత్యం మంత్రాలు 1 లక్షా 25 వేలు జపించిన తరువాత దశాంశ హవనం (10 వేలు) తిప్పతీగతో చేస్తే మంత్రసిద్ధి కలుగుతుంది. ఇవికాక ప్రత్యంగిర హవనంలో ఆవునెయ్యి, గేదెనెయ్యి, ఆవాల నూనె వేపనూనె, విప్పనూనె, ఆవాలు ఉత్తరేణి, మిరపకాయలు (ఎండు) తేనే (విభేతకి), ఆవాలు, వెల్లుల్లి, ఊదుగు, మునగకాయలు, శొంఠి, పిప్పిళ్ళు, మిరియాలు, ఆముదము వాడతారు. సమిధలుగా (కట్టెలు) వేప, ఉత్తరేణి, తెల్ల జిల్లేడు, మునగ మోదగ, చంద్ర వాడతారు. తేనె, క్షీరాన్నం, చెరుకుగడ, సైంధవలవణం, జీలకర్ర మిరియాలతో హవనం ధనప్రాప్తి నిస్తుంది. నల్ల ఈశ్వరి సమిధల హవనంతో అమ్మవారు సాక్షాత్కరిస్తుంది. తెల్లజిల్లేడు సమిధలు మిరియాలు, బర్రెనెయ్యి, నువ్వులతో హవనం తాంత్రిక ప్రయోగా లను నివారిస్తుంది. బ్రహ్మదండితో శత్రు సంహార చేయవచ్చు.



# సమర్పణ

మా గురుదేవులు శ్రీ నిఖిలేశ్వరానందస్వామి (డా॥ నారాయణ దత్త శ్రీమాలిగారు) వారి అనుగ్రహంతో వ్యాఖ్యానించబడుతున్న **"శ్రీనిఖిల తంత్రాలను"** వారి శ్రీచరణాలలోనే సమర్పిస్తున్నాను.

**– స్వామీ మధుసూదన సరస్వతి**

# పీఠిక

ప్రతంగిరా సాధన అత్యంత ప్రాచీనమైనది. ఈ దేవత అధర్వణ వేదంలో చాల శక్తిమంతమైనదిగా కనిపిస్తుంది. ఏ శత్రువు ఎంతటి ప్రయోగం చేసినా, దానిని నివారించటమే కాక తిరిగివెళ్ళి పంపిన వానినే చంపివేసే లక్షణం ఈ విద్యలో ఉన్నది. ఆధర్వణ ఋక్కులలో ఈ మంత్రదేవతకు కేవలం తేజస్సు మాత్రమే ఆకృతిగా–విద్యున్మయమైన మూర్తిగా చెప్పబడింది. చాలా మంత్రాలలో బ్రహ్మశక్తిగా అంటే తపశ్శక్తిగా వర్ణనలు కనిపిస్తున్నాయి. ఇందులోని ఋఙ్మంత్రాలను వివిధ ప్రయోజనాలకు ఉపయోగించటము కూడా ఉన్నది. జ్ఞాతాజ్ఞాత శత్రువులను నాశనం చేయటానికి మాత్రమే కాక, సర్వరోగ నివారిణిగా ఈ విద్య ప్రచారంలో ఉన్నది.

తర్వాతి కాలంలో ఈ దేవతను సింహముఖం కల్గిన దానినిగా తంత్ర గ్రంథాలు వర్ణించినవి. సింహీం, సింహముఖీం - అని, సింహవాహన అని కొన్ని చోట్ల కనిపిస్తున్నది. వేదంలో మాత్రం పరకృత్యా నాశని, శత్రు సంహారిణి, రోగనివారిణియైన మహాశక్తిగా అభివర్ణితమైనది. ఈ ఋక్కులలో చివరి భాగంలో కొన్ని అధిక పాఠాలు. 45 మాత్రమే మొదటివని తర్వాతవి కాలాంతరాన చేరినవని కొందరి అభిప్రాయం.

భాగవతంలో కాశీరాజు శ్రీ కృష్ణుని మీద అభిచారిక హోమం చేయించి కృత్యను ప్రయోగింప జేశాడు. అది ద్వారక మీదకు త్రోవ అంతా దహిస్తూ వెళ్ళింది. కృష్ణుడప్పుడు ద్వారకలో లేడు కాపలాగా ఉన్న సుదర్శన చక్రం ఆకృత్యను దహించి, అంతటితో ఊరుకోక కాశీకి వెళ్ళి పట్టణాన్ని దగ్ధం చేసింది. 12 సంవత్సరాలు వారణాసి తగలబడుతూనేఉంది. తాత్కాలికంగా విశ్వనాధుడు మందర పర్వతం మీద తలదాచుకున్నాడట! కృత్యను దహించినందువల్ల కావచ్చు - ఒక ప్రత్యంగిరా మంత్రం - సుదర్శనాస్త్ర మంత్ర సంపుటితమైనది మంత్ర శాస్త్రంలో ఉన్నది.

కన్నడ భారతంలో ఒక అద్భుతకథ ఉన్నది. పాండవులు వనవాసం చేస్తూ ఉండగా దుర్యోధనుడు కనకస్వామి అనే మాంత్రికుని పిలిపించి అభిచారిక హోమం చేయించాడు. ఆ మంత్రవేత్త ఒక కృత్యను పుట్టించి పాండవులను చంపమని పంపించాడు. ఆ కృత్య వాళ్ళ దగ్గరకు వెళ్ళేటప్పటికి యక్ష ప్రశ్నల ఘట్టం జరుగుతున్నది. భీమార్జున నకుల సహదేవులు స్పృహ దప్పి ఉన్నారు. ధర్మరాజు యక్షుని ప్రశ్నలకు సమాధానం చెపుతున్నాడు. ఈ కృత్య పాండవులను చంపబోయింది. ఆ యక్షుడు (ధర్మదేవత) అడిగాడు - కృత్యా! ఎవరునీవు?

**కృత్య** : నేను అభిచారిక హోమకుండంలో మంత్ర ప్రేరణ వల్ల ఉదయించాను.

**యక్షుడు :** నిన్నెవరు పంపారు? ఎందుకు?

**కృత్య** : కనకస్వామి అనే మాంత్రికుడు పాండవులను చంపమని ఆజ్ఞాపించాడు.

**యక్షుడు :** వీళ్ళిప్పుడు నా వలయంలో ఉన్నారు. వీళ్ళను ఏమి చెయ్యాలనేది నా నిర్ణయం. నా దగ్గర ఉన్న వీళ్ళను నీవు చంపటానికి అనుమతించను వెళ్ళిపో!

**కృత్య** : నేను మీ తేజోవలయంలోకి ప్రవేశించలేకున్నాను. పాండవులను ఏమీ చేయలేనని తెలుసుకున్నాను. కానీ నేను చంపటానికి పుట్టాను. అది తప్పదు. ఎవరినైనా చంపాలి.

**యక్షుడు :** అయితే నిన్ను పంపిన వాణ్ణి చంపు – వెళ్ళిపో.

కృత్యవెళ్ళి కనకస్వామిని చంపింది. ఇటువంటి త్రిప్పికొట్టే విద్య – ప్రత్యంగిర. క్రోధ భయంకరమూర్తి. దీనిని ఉపాసించేవాడు తీవ్ర శక్తి గలవాడై ఉంటాడు. అందుకే తెలుగునాట ప్రత్యంగిర చేసేవాని పంచన ఉండవద్దన్న మాట పుట్టింది. (దీని వివరణ సహస్రనామావళి చివర ఇవ్వబడింది.)

ఈ గ్రంథంలో ప్రత్యంగిరా సాధనలో భాగంగా, ఆధర్వణఋక్కులు, వాటి తాత్పర్యము ఇవ్వబడినది. తంత్ర గ్రంథాలలోని కవచము, స్తుతులు, అష్టోత్తరశత నామావళి ఇవ్వబడినది.

ఇటీవల దక్షిణ దేశంలో ఒక గొప్ప నాయకురాలు ప్రత్యంగిరా యజ్ఞం చేయించటం వల్ల ఎన్నికలలో శత్రువులను ఓడించి అధికారంలోని వచ్చిందని ప్రచారంలో ఉంది. కారణం ఏదైనా ఇప్పుడు తమిళనాడులో ప్రత్యంగిర – ఆలయాలు, పూజలు, యజ్ఞాలు ఎక్కువైనవి. మా కుర్తాళం సిద్ధేశ్వరీ పీఠంలోను, విశాఖపట్టణ లలితా పీఠంలోను ప్రత్యంగిరా ప్రతిష్ఠలు జరిగినవి. ప్రజలు – ఈ దేవతా పూజలలో, హోమాలలో విరివిగా పాల్గొంటున్నారు. గుంటూరులోని మా స్వయం సిద్ధ కాళీ పీఠంలో దుష్ట గ్రహ, పిశాచ, రోగ బాధా నివారణకు ప్రత్యంగిరా హోమ ప్రయోగం విజయ వంతంగా నిర్వహించబడుతున్నది.

భక్తులైన సాధకులు ప్రత్యంగిరా సాధన చేసి ఉపయోగము పొందుదురుగాక!

(కుర్తాళం శంకరాచార్యులు, జగద్గురు శ్రీ సిద్ధేశ్వరానంద భారతీస్వామి వారు ప్రత్యంగిరా సాధన అనే పుస్తకానికి వ్రాసిన పీఠిక ఇది. కృతజ్ఞతలతో ఇవ్వబడుతోంది – పబ్లిషర్)

# ఉపాసనాప్రకరణం

## శ్రీ పత్యంగిరా ఉపాసన

### ప్రత్యంగిరా తాంత్రోక్త యంత్రం




### కృత్యా తాంత్రోక్త యంత్రం




### ప్రత్యంగిరా పూజా యంత్రము



## 1. పంచవింశత్యక్షరి ప్రత్యంగిరా : (25 అక్షరాలు)

**వినియోగః :**

అస్యశ్రీ ప్రత్యంగిరామహా మంత్రస్య, మహా భైరవ ఋషిః, అనుష్టుప్ ఛందః; శ్రీ ప్రత్యంగిరా దేవతా; ఏంబీజం; హ్రీం శక్తిః; స్వాహా కీలకం; సర్వ కామ్యసిద్ధ్యర్ధే జపే వినయోగః

**లఘున్యాసః :**

భైరవ ఋషయే నమః – శిరసి
అనుష్టుప్ ఛందసే నమః – ముఖే
ప్రత్యంగిరా దేవతాయై నమః – హృది
హ్రీం బీజాయ నమః – గుహ్యే
శ్రీం శక్తయే నమః – పాదయోః
స్వాహా కీలకాయా నమః – నాభౌ
ఐం నమః – నాభ్యాది పాదాంతం
హ్రీం నమః – కంఠాది నాభ్యాంతం
శ్రీం నమః – మూర్ధాది కంఠాంతం
ఐం నమః – వామపాణితలే
హ్రీం నమః – దక్షిణ పాణితలే
శ్రీం నమః – ఉభయోః

**కరన్యాసః :**

ఓం ఐం అంగుష్ఠాభ్యాం నమః
ఓం హ్రీం తర్జనీభ్యాం నమః
ఓం శ్రీం మధ్యమాభ్యాం నమః
మమ రక్ష రక్ష కనిష్ఠి కాభ్యాం నమః
మమ శత్రూన్ భక్ష భక్ష ఓం స్వాహా కరతలకర పుష్టాభ్యాం నమః

**అంగన్యాసః :**

ఓం ఐం హృదయాయ నమః
ఓం హ్రీం శిరసే స్వాహా
ఓం శ్రీం శిఖాయై వషట్
ప్రత్యంగిరే కవచాయ హుం
మమ రక్ష రక్ష నేత్రత్రయాయ వౌషట్

మమ శత్రూన్ భక్ష భక్ష ఓం స్వాహా అస్త్రాయ ఫట్
భూర్భువస్సువరోమితి దిగ్బంధః

**ధ్యానం :**

**ఆశాంబరా ముక్తకచా ఘనచ్ఛవి ర్ధ్యేయా స చర్మాసి కరాహి భూషణా ।**
**దంష్ట్రోగ్ర వక్త్రా గ్రసితాహితా త్వయా ప్రత్యంగిరా శంకర తేజసేరితా ॥**

**మంత్రం :**

**ఓం ఐం హ్రీం శ్రీం ప్రత్యంగిరే మమ రక్ష రక్ష మమ శత్రూన్ భక్ష-భక్ష ఓం స్వాహా.**

## 2. ప్రత్యంగిర సాధన (ఉపాసన) విధానం - ఫలం :

1. ప్రతి నిత్యం ప్రత్యంగిరా మంత్రం జపిస్తూ, దేవిని అర్చించే వారి శత్రువులు క్రమంగా అంతరించిపోయి, అతడిపై చేయబడ్డ ప్రయోగాలు తొలగిపోతాయి.

2. కలశస్థాపన చేసి కలశం ఎదురుగా బియ్యపు రాశి మీద ప్రత్యంగిరా యంత్రాన్ని నిలిపి ప్రాణప్రతిష్ఠ చేసి ఆవరణ పూజచేసి సహస్రనామావళితో అర్చించి, లక్షా 25 వేలు మూల మంత్రం (నారాయణీ ప్రత్యంగిర, పంచవింశత్యక్షరి ప్రత్యంగిర లేదా మరేదైనా ప్రత్యంగిరా మంత్రం) జపించి, షట్పాత్రం చేసిన వైదికాగ్ని లేదా, పంచమానస పూజలు చేసిన తాంత్రికాగ్నిలో తెల్లజిల్లేడు సమిధలు, మిరియాలు, గేదె (బర్రె) నెయ్యి, నువ్వులతో హోమం చేస్తే అన్యతాంత్రికులు చేసిన ఏ ప్రయోగమైనా ఎటువంటి దుష్ట గ్రహాలైనా నశించి పోతాయి.

3. గొంతులోతు నీళ్ళలో దక్షిణా ముఖంగా రాత్రిపూట నిలబడి శత్రువు గోత్ర నామాలు సంపుటీకరించి 13 వందలు జపిస్తే, శత్రువు 7 రోజులు తీవ్ర జ్వరానికి లోనై నశిస్తాడు.

4. అమావాస్య ఆదివారం బ్రహ్మ దండి చెట్టుకు ప్రాణప్రతిష్ఠ చేసి, శత్రువు వాడే బట్టను దానికి చుట్టి పూజించి, మూలమంత్రాన్ని శత్రువు గోత్రనామాలతో మూడు వేల సార్లు జపించి, ఆ చెట్టును బాగా మెలిపెట్టి, దానిమీద బరువైన రాయి పెడితే, శత్రువు అర్థంకాని, తిరుగులేని రోగానికి లోనై మళ్ళీ అమావాస్య వరకు మరణిస్తాడు. (బరువుగా పెట్టిన రాయి తీసి వేయక పోతే)

5. బ్రహ్మదండి విత్తులు, శ్మశానం బూడిద, పాము విషం కలిపి ప్రత్యంగిరా మంత్రం 10,000 జపించి, మంత్రించి ఎవడి తలపై వేస్తే వాడు 3 దినాలలో మరణిస్తాడు.

6. స్నానం చేసిన తరువాత తడి బట్టలతో 10 రోజులలో 1 లక్షా 25 వేలు జపం పూర్తి చేసి తాంత్రికాగ్నిలో ఆవనూనెలో ముంచిన చంద్ర సమిధలు 10% హవనం చేస్తే, అసంఖ్యాకంగా ఉన్న శత్రువులు, వారి సైన్యాలు వారు చేసే భయంకరమైన తాంత్రిక ప్రయోగాలు అన్నీ నశిస్తాయి.

7. ఎటువంటి కోరికలు లేక నియమంగా రోజూ ప్రత్యంగిర జపించే సాధకుడికి సహజంగానే అన్ని జీవితావసరాలు సమకూడి అతడి శత్రువులు సహజంగానే అంతమౌతారు.

## 3. ప్రాణ ప్రతిష్ఠ :

ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం లం క్షం హ సౌం హంస; శ్రీప్రత్యంగిరాయాః (కృత్యాయాః) ప్రాణా ఇహప్రాణాః ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం క్షం హసౌం శ్రీ ప్రత్యంగిరాయాః (కృత్యాయాః) జీవ ఇహ స్థితః । ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం సం హం ళం క్షం హంసః శ్రీ పత్యంగిరాయాః (కృత్యాయాః) సర్వేంద్రియాణి ఇహస్థితాని ఓం ఆం హ్రీం క్రోం యం రం లం వం శం షం శ్రీ ప్రత్యంగిరాయాః (కృత్యాయాః ) సం హం లం క్షం హసౌం హంసః శ్రీ ప్రత్యంగిరాయాః (కృత్యాయాః) వాంగ్మన స్త్వక్ చక్షుః శ్రోత్ర ఘ్రాణ ప్రాణా ఇహాగత్య సుఖం చిరం తిష్ఠంతు స్వాహా ॥

## 4 . మాతృకా న్యాసః :

### వినియోగః :

ఓం అస్యశ్రీ అంతర్మాతృకాన్యాసస్య బ్రహ్మ ఋషిః గాయత్రీ ఛందః. శ్రీ మాతృకా సరస్వతీ దేవతా, హలో బీజాని, స్వరాః శక్తయః, అవ్యక్తం కీలకం, శ్రీ ప్రత్యంగిరాత్వేన న్యాసే వినియోగః

### లఘున్యాసః :

బ్రహ్మ ఋషయే నమః శిరసి
గాయత్రీ ఛందసే నమః - ముఖే
శ్రీ అంతర్మాతృకా దేవతాయై నమః - హృదయే

హలో బీజేభ్యో నమః - గుహ్యే
స్వరాః శక్తి భ్యో నమః - పాదయోః
అవ్యక్తం కీలకాయ నమః - నాభౌ
శ్రీ ప్రత్యంగిరాత్వేన న్యాసే వినియోగః - సర్వాంగేషు

**కరన్యాసః :**

ఓం ఐం హ్రీం శ్రీం అం కం ఖం గం ఘం ఙం ఆం-అంగుష్ఠాభ్యాంనమః
ఓం ఐం హ్రీం శ్రీం ఇం చం ఛం జం ఝం ఞం ఈం-తర్జనీభ్యాంనమః
ఓం ఐం హ్రీం శ్రీం ఉం టం ఠం డం ఢం ణం ఊం-మధ్యమాభ్యాంనమః
ఓం ఐం హ్రీం శ్రీం ఏం తం థం దం ధం నం ఐం-అనామికాభ్యాంనమః
ఓం ఐం హ్రీం శ్రీం ఐం పం ఫం బం భం మం ఔం-కనిష్ఠికాభ్యాంనమః
ఓం ఐం హ్రీం శ్రీం అం యం రం లం వం శం షం సం హం లం క్షం
అః - కరతలకరపుష్టాభ్యాం నమః

**అంగన్యాసః :**

ఓం ఐం హ్రీం శ్రీం అం కం ఖం గం ఘం ఙం ఆం - హృదయాయనమః
ఓం ఐం హ్రీం శ్రీం ఇం చం ఛం జం ఝం ఞం ఈం - శిరసే స్వాహా.
ఓం ఐం హ్రీం శ్రీం ఉం టం ఠం డం ఢం ణం  ఊః - శిఖాయై వషట్.
ఓం ఐం హ్రీం శ్రీం ఏం తం థం దం ధం నం ఐం - కవచాయ హుం
ఓం ఐం హ్రీం శ్రీం ఐం పం ఫం బం భం మం ఔం - నేత్రత్రయాయ వౌషట్
ఓం ఐం హ్రీం శ్రీం తం యం రం లం వం శం షం సం హం లం క్షం అః - అస్త్రాయ ఫట్

**మహాన్యాసః :**

అం నమః, ఆం నమః, ఇం నమః, ఈం నమః, ఉం నమః, ఊం నమః , ఎం నమః, ఏం నమః, ఐం నమః, ఓం నమః, ఓం నమః, ఔం నమః, అం నమః, అః నమః - కంఠే షోడశ దళే.

కం నమః, ఖం నమః, గం నమః, ఘం నమః, ఙం నమః, చం నమః ఛం నమః, జం నమః, ఝం నమః, ఞం నమః, టం నమః, ఠం నమః, - అనాహతే (హృదయే) ద్వాదశ దళే.

డం నమః, ణం నమః, తం నమః, దం నమః, ధం నమః, నం నమః పం నమః, ఫం నమః, - నాభౌ దశదళే.

బం నమః, భం నమః, మం నమః, యం నమః, రం నమః, లం నమః - లింగమూలే షట్ దళే.

వం నమః, శం నమః, షం నమః, సం నమః – మూలాధారే చతుర్దళే.
హం నమః, ళం నమః – భ్రూమధ్యేద్వితళే
క్షం నమః – సహస్రారే సహస్రదళే

ఓం ఐం హ్రీం శ్రీం అం నమః – శిరసి,
ఓం ఐం హ్రీం శ్రీం ఆం నమః – ముఖ వృత్తే
ఓం ఐం హ్రీం శ్రీం ఇం నమః – దక్ష నేత్రే
ఓం ఐం హ్రీం శ్రీం ఈం నమః – వామనేత్రే
ఓం ఐం హ్రీం శ్రీం ఉం నమః – దక్ష కర్ణే
ఓం ఐం హ్రీం శ్రీం ఊం నమః – వామ కర్ణే
ఓం ఐం హ్రీం శ్రీం ఋం నమః – దక్ష నాసే
ఓం ఐం హ్రీం శ్రీం ౠం నమః – వామ నాసే
ఓం ఐం హ్రీం శ్రీం ఌం నమః – దక్ష గండే
ఓం ఐం హ్రీం శ్రీం ౡం నమః – వామగండే
ఓం ఐం హ్రీం శ్రీం ఏం నమః – ఊర్ధ్వోష్ఠే
ఓం ఐం హ్రీం శ్రీం ఐం నమః – అధరోష్ఠే
ఓం ఐం హ్రీం శ్రీం ఓం నమః – ఊర్ధ్వదంతపంక్తౌ
ఓం ఐం హ్రీం శ్రీం ఔం నమః – అథోదంత పంక్తౌ
ఓం ఐం హ్రీం శ్రీం అం నమః – మూర్ధ్ని
ఓం ఐం హ్రీం శ్రీం ఆం నమః – అస్థ్ని
ఓం ఐం హ్రీం శ్రీం కం నమః – దక్షబాహు మూలే
ఓం ఐం హ్రీం శ్రీం ఖం నమః – కూర్పరే
ఓం ఐం హ్రీం శ్రీం గం నమః – మణి బంధే
ఓం ఐం హ్రీం శ్రీం ఘం నమః – దక్ష హస్తాంగులిమూలే
ఓం ఐం హ్రీం శ్రీం ఙం నమః – దక్ష హస్తాంగుల్యగ్రే
ఓం ఐం హ్రీం శ్రీం చం నమః – వామబాహుమూలే
ఓం ఐం హ్రీం శ్రీం ఞం నమః – వామ హస్తాం గుల్యగ్రే
ఓం ఐం హ్రీం శ్రీం టం నమః – దక్ష బాహు మూలే
ఓం ఐం హ్రీం శ్రీం ఠం నమః – జానుని
ఓం ఐం హ్రీం శ్రీం డం నమః – గుల్ఫే
ఓం ఐం హ్రీం శ్రీం ఢం నమః – దక్షపాదాం గులిమూలే
ఓం ఐం హ్రీం శ్రీం ణం నమః – దక్షపాదాం గుల్యగ్రే

ఓం ఐం హ్రీం శ్రీం తం నమః – వామ పాదమూలే
ఓం ఐం హ్రీం శ్రీం దం నమః – జానుని
ఓం ఐం హ్రీం శ్రీం ధం నమః – గేల్ఫే
ఓం ఐం హ్రీం శ్రీం నం నమః – వామ పదాంగులి మూలే
ఓం ఐం హ్రీం శ్రీం పం నమః – వామ పదాం గుల్యగ్రే
ఓం ఐం హ్రీం శ్రీం ఫం నమః – దక్షపార్శ్వే
ఓం ఐం హ్రీం శ్రీం బం నమః – వామపార్శ్వే
ఓం ఐం హ్రీం శ్రీం భం నమః – పృష్టే
ఓం ఐం హ్రీం శ్రీం మం నమః – నాభౌ
ఓం ఐం హ్రీం శ్రీం యం నమః – ఉదరే
ఓం ఐం హ్రీం శ్రీం రం త్వగాత్మనే నమః – వామాంసే
ఓం ఐం హ్రీం శ్రీం లం అసృగాత్మనే నమః – దక్షాంసే
ఓం ఐం హ్రీం శ్రీం వం మాంసాత్మనే నమః – హృదయాది దక్ష కరాంతం
ఓం ఐం హ్రీం శ్రీం అస్యాత్మనే నమః – హృదయాది వామకరాంతం
ఓం ఐం హ్రీం శ్రీం మజ్జాత్మనే నమః – హృదయాది దక్ష పాదాంతం
ఓం ఐం హ్రీం శ్రీం శుక్లాత్మనే నమః – హృదయాది వామ పాదాంతం
ఓం ఐం హ్రీం శ్రీం ప్రాణాత్మనే నమః – పాదాది హృదయాంతం
ఓం ఐం హ్రీం శ్రీం ళం జీవాత్మనే నమః – హృదయాది మూర్ధాంతం
ఓం ఐం హ్రీం శ్రీం క్షం పరమాత్మనే నమః – మూర్ధాది హృదయాంతం

## ధ్యానం :

**పంచాశద్వర్ణ రూపాంచ కపర్ధశశి భూషణాం**
**శుద్ధ స్ఫటిక సంకాశాం శుద్ధక్షౌమ విరాజితాం ।**
**ముక్తారత్న స్ఫురద్భూషాం జపమాలాం కమండలం**
**పుస్తకం వరదానంచ బిభ్రతీం పరమేశ్వరీమ్ ॥**

## విద్యాన్యాసం :

ఐం నమః దక్షమణిబంధే, హ్రీం నమః దక్షతలే, శ్రీం నమః దక్ష కరే, ఐం నమః దక్ష కక్ష్యే, హ్రీం నమః దక్ష కూర్పరే, శ్రీం నమః దక్ష పాణౌ, ఐం నమః వామక క్ష్యే, హ్రీం నమః వామ కూర్పరే, శ్రీం నమః వామపాణౌ, ఐం నమః దక్షపాదకక్ష్యే, హ్రీంనమః జానుని, శ్రీం నమః పాదాగ్రే, ఐం నమః వామపాద కక్ష్యే, హ్రీం నమః జానుని, శ్రీం నమః పాదాగ్రే, ఐం నమః లింగే, హ్రీం నమః హృది, శ్రీం నమః పాదాంతే ॥

## నవయోని న్యాసం :

ఐం నమః దక్ష కర్ణే, హ్రీం నమః వామ కర్ణే, శ్రీం నమః చిబుకే, ఐం నమః దక్ష శంఖే, హ్రీం నమః వామ శంఖే, శ్రీం నమః ముఖే, ఐం నమః దక్ష నేత్రే, హ్రీం నమః వామనేత్రే, శ్రీం నమః కుక్షౌ, ఐం నమః దక్షజానుని, హ్రీం నమః వామజానుని శ్రీం నమః జననేంద్రే, శ్రీం నమః నాభౌ, ఐం నమః దక్ష పాదే, హ్రీం నమః వామపాదే, శ్రీం నమః హృది, ఐం నమః దక్ష జానుని, హ్రీం నమః వామ జానుని, శ్రీం నమః కంఠే ॥

## పీఠన్యాసం :

మూలాధారే ఆధార శక్తయే నమః, ప్రకృత్త్యైనమః, కమఠాయ నమః, శేషాయ నమః, పృధివ్యై నమః, సుధాంబుధయే నమః, మణిద్వీపాయై నమః, చింతామణి గృహాయ నమః, రత్న వేదికాయై నమః, మణిపీఠాయై నమః

దిక్షు నానాముని గణేభ్యోనమః, సమస్త దేవేభ్యోనమః, పద్మాయ నమః, ప్రకృతి మయ పత్రేభ్యోనమః, వికృతిమయ కేసరేభ్యోనమః, పంచాశత్ బీజభూషిత కర్ణికాయైనమః, హంసౌం సదాశివ మహా ప్రేతాసనాయై నమః, బ్రహ్మ విష్ణు రుద్రేశ్వర సదాశివ మహాప్రేత మహా పద్మాసనాయనమః పరమ శివ పర్యంకాయ నమః.

## ధ్యానం :

**ఊర్ధ్వం కపాలం డమరుం త్రిశూలం సంబిభ్రతీ బద్ధ కళావతంసం ।**
**పింగోర్ధ్వ కౌశీ సితభీమదంష్ట్రా భూయా ద్విభూత్యై మమభద్రకాళీ ॥**

## పంచమాన సోపచార పూజా :

లం - పృధ్వి తత్వ ప్రత్యంగిరాయై నమః గంధం పరికల్పయామి
హం - ఆకాశతత్వ ప్రత్యంగిరాయై నమః పుష్పం పరికల్పయామి
యం - వాయుతత్వ ప్రత్యంగిరాయై నమః ధూపం పరికల్పయామి
రం - వహ్నితత్వ ప్రత్యంగిరాయై నమః దీపం పరికల్పయామి
వం - అమృతత్వ ప్రత్యంగిరాయై నమః నైవేద్యం పరికల్పయామి
సం - సర్వ తత్వ ప్రత్యంగిరాయై నమః సర్వోపచారాన్ పరికల్పయామి

## మంత్రం :

**ఏదైనా ప్రత్యంగిరా మంత్రం యథాశక్తి జపం చేయాలి.**

# 5. యంత్రపూజా

## ప్రత్యంగిరా పూజా యంత్రము




### ఆవరణార్చన :

ప్రాచ్యాం దిశీంద్రో దేవతా ! ఐరావతారూఢో హేమవర్ణో వజ్ర హస్తః ఇంద్రః।ఇంద్ర శ్రీ పాదుకాం పూజయామి, తర్పయామి నమః

ఆగ్నేయ్యాం దిశ్యగ్నిర్దేవతా। మేషారూఢోరక్తవర్ణో జ్వాలాహస్తోఽ_గ్నిః। అగ్ని శ్రీ పాదుకాం పూజయామి, తర్పయామినమః

యామ్యాందిశి యమో దేవతా। మహిషారూఢః కృష్ణవర్ణో దండ హస్తో యమః యమశ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

నైఋత్యాందిశి నిర్ఋతిర్దేవతా। నరారూఢో నీలవర్ణః ఖడ్గహస్తో నిర్ఋతిః । నిర్ఋతి శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

వారుణ్యాం దిశి వరుణో దేవతా । మకరారూఢః శ్వేత వర్ణః పాశహస్తో వరుణః వరుణశ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

వాయువ్యాం దిశి వాయుర్దేవతా । మృగారూఢో ధూమ్రవర్ణో ధ్వజహస్తో వాయుః । వాయు శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

కౌబేర్యాం దిశి కుబేరో దేవతా। అశ్వారూఢః పీత వర్ణో గదాంకుశ హస్తః కుబేరః । కుబేర శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

ఈశాన్యా దిశి ఈశానో దేవతా। వృషారూఢః స్ఫటికవర్ణస్త్రిశూల హస్తః। ఈశాన శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

ఊర్ధ్వాయాం దిశి బ్రహ్మ దేవతా । హంసారూఢః రక్తవర్ణః కమండలు హస్తో బ్రహ్మ । ఇంద్ర ఈశాన్యయోర్మధ్యే బ్రహ్మశ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః ।

అధస్తాదిశి వాసుకిర్దేవతా । కూర్మారూఢో నీలవర్ణః పద్మహస్తో వాసుకిః। వరుణ నిర్ఋతయోర్మధ్యే అనంత శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

అవాంతర స్యాందిశి విష్ణుర్దేవతా గరుడా రూఢః శ్యామవర్ణ శ్చక్రహస్తః । బిందౌ నారాయణ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

## త్రివృత్తి :

కౌలానంద నాథ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
పరమగురు సచ్చిదానందస్వామి శ్రీ పాదుకం పూజయామి తర్పయామి నమః
పరమాచార్య శ్రీ పాదుకం పూజయామి తర్పయామి నమః
పరమేష్టి గురు శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
దివ్యౌఘ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
సిద్ధౌఘ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
మానవౌఘ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
స్వగురు శ్రీ నిఖిలేశ్వర శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

## అష్టదళేషు : (తూర్పు నుండి)

అం అసితాంగ భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః । ఆం బ్రాహ్మీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః। ఇం రురు భైరవ శ్రీ

పాదుకాం పూజయామి తర్పయామి నమః । ఈం మహేశ్వరి శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః। ఉం చండ భైరవ శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః । ఊం కౌమారీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః । ఋం క్రోధ భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః । ౠం వైష్ణవి శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః । ఌం ఉన్మత్త భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః। ౡం వారాహీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః ఏం కపాలి భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః । ఐం మాహేంద్రీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః । ఓం భీషణ భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః । ఓం చాముండా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః । అం సంహార భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః । అః నారసింహ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః ।

## గ్రంథిస్థానేషు (పశ్చిమం నుండి) :

కామరూప పీఠ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
మలయ గిర పీఠ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
లోలాగిరి పీఠ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
కాలాంతర పీఠ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
చోహార పీఠ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
జాలంధరపీఠ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
ఉడ్డియాన పీఠ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
దేవకూటపీఠ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

## వృత్త మండలే (పశ్చిమ నుండి - పైన క్రింద కూడా) :

హేతుక భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
భేతాళ భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
త్రిపురాంతక భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
అగ్నిజిహ్వా భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
కాలాంతక భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
కపాలి భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
ఏకపాద భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
భీమరూప భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

ఊర్ధ్వం – మలయ భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
అథః – హాటకేశ్వర భైరవ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

**అష్టయోనిషు :**

ఓం ఐం హ్రీం శ్రీం స్తంభినీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః
ఓం ఐం హ్రీం శ్రీం క్షోభిణి శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః
ఓం ఐం హ్రీం శ్రీం ద్రావిణీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః
ఓం ఐం హ్రీం శ్రీం భ్రామిణి శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః
ఓం ఐం హ్రీం శ్రీం రౌద్రిణి శ్రీ పాదుకాం పూజయామి తర్పయామినమః
ఓం ఐం హ్రీం శ్రీం సంహారిణి శ్రీపాదుకాం పూజయామి తర్పయామినమః
ఆగ్నేయే ఓం ఐం హ్రీం శ్రీం హృదయాయ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
ఈశాన్యే ఓం ఐం హ్రీం శ్రీం శిరః శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి  నమః
నైఋత్యం ఓం ఐం హ్రీం శ్రీం శిఖా శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
వాయువ్యే ఓం ఐం హ్రీం శ్రీం కవచ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
మధ్యే ఓం ఐం హ్రీం శ్రీం నేత్ర శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః
దిక్షు ఓం ఐం హ్రీం శ్రీం అస్త్ర శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

**త్రికోణే :**

ఆగ్నేయే ఓం ఐం హ్రీం శ్రీం కాళీ శ్రీపాదుకాం పూజయామి తర్పయామి నమః

ఈశాన్యే ఓం ఐం హ్రీం శ్రీం భద్రకాళీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

ఆగ్నేయే ఓం ఐం హ్రీం శ్రీం నిత్యకాళీ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః

**బిందౌ :**

"ఓం ఐం హ్రీం శ్రీం ప్రత్యంగిరే మమ రక్ష–రక్ష మమ శత్రున్ భక్ష భక్ష ఓం స్వాహా ।"

శ్రీ భైరవ సహితాం శ్రీమత్ శ్రీ పత్యంగిరా పరా వామపాదుకాం పూజయామి తర్పయామి నమః

**చతురస్రే :**

పశ్చిమే – బాం బటుకం పూజయామి నమః
ఉత్తరే – యాం యోగినీభ్యో నమః

పూర్వే – క్షాం క్షేత్ర పాలాయ నమః
దక్షిణే – గం గణపతయే నమః
వాయవ్యే – వసుధాభ్యో నమః
ఈశాన్యే – ద్వాదశాదిత్యేభ్యో నమః
ఆగ్నేయే – ఏకాదశ రుద్రేభ్యో నమః
నైఋత్యాం – సర్వేభ్యో భూతేభ్యో నమః

దేవీ సమీపంలో – దక్షహస్తే ఆసి శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః చర్మ శ్రీ పాదుకాం పూజయామి తర్పయామి నమః, బిందౌ–మూల మంత్రంతో పూజించి, తర్పణమాచరించి, తాంత్రిక ముద్రలు ప్రదర్శించి మూడు దోసిళ్ళ (అంజలి) పూలతో అర్చించాలి.

## 6. హోమం – బలి సమర్పణ

తాంత్రికాగ్నిని ప్రజ్వలించి, అందులో ప్రత్యంగిరా యంత్రాన్ని భావించి, పంచోపచారాలు చేసి, ఆహుతులు ఇవ్వండి.

**బలి :**

ఈశాన్యంలో కుంకుమతో మండలం నిర్మించి “బాం బటుకాయ నమః ఏహ్యేహి దేవీపుత్ర బటుకనాథ కపిలజటాభార భాస్వర త్రినేత్ర జ్వాలాముఖ సర్వవిఘ్నాన్ నాశయ, నాశయ, సర్వోపచార సహితం బలిం గృహ్ణ గృహ్ణ స్వాహా”.

**ఆగ్నేయాం – యోగినీభ్యోనమః :**

**ఊర్ధ్వం బ్రహ్మాండతోవా దివిగగనతలే భూతలే నిష్కలేవా**
**పాతాళే వాతలేవా పవన సలిలయో యత్ర కుత్రస్థితోవా ॥**
**క్షేత్ర పీఠోప పీఠాధిషుచ కృతపదా ధూపదీపాది కేన**
**ప్రీతాదేవ్యః సదానః శుభ బలివిధినాపాతు వీరేంద్ర వంద్యా ॥**

యాం యోగినీభ్యో నమః స్వాహా ॥ సర్వయోగినీహ్రీం ఫట్‌స్వాహా–ఇతి యోగిని బలి ॥

**<u>నైఋత్యాం</u> :**

క్షాం క్షీం క్షూం క్షైం క్షౌ క్షః క్షేత్రపాల అతిబలి సహితం బలిం గృహ్ణ గృహ్ణ స్వాహా ॥

**వాయవ్యే :**

గాం గీం గూం గణపతయే వరవరద సర్వజనంమే వశమానయ బలిం గృహ్ణ గృహ్ణ స్వాహా ॥

ఇతి బలిం సమర్ప్య - ఛాగాది బలిమపిదత్వా గురు దేవ్యౌ ధ్యాయన్, యధాశక్తి జపం కృత్వా ॥

గుహ్యాతిగుహ్యాం గోప్త్రీత్వం గృహాణాస్మత్కృతం జపం ।
సిద్ధిర్భవతు మేదేవి శ్రీమత్రప్రత్యంగిరే శివే ॥

ఇతి తేజోమయం జపఫలం దేవీ వామహస్తే సమర్ప్య కవచ - సహస్ర నామం పఠిత్వా సాష్టాంగం ప్రణిపత్య ప్రదక్షిణీ కృత్య, శాంతిం పఠిత్వా "ఈశాన్యే నిర్మాల్యేన నిర్మాల్య వాసిన్యై నమః" ఇతి సంపూజ్య జాగ్రత్ స్వప్నసుషుప్త్యవస్థాసు మనసావాచా పద్భ్యాం ఉదరేణ శిశ్నాప్రాణ దేహ ధర్మాది కారణతో యుక్తం, యత్ కృతం తాత్సర్వం మదీయం శ్రీ పుత్యంగిరా చరణే సమర్పణ మస్తు ఓం తత్ సత్.

## 7. ప్రత్యంగిరా స్తోత్రం

**వినియోగః :**

ఓం అస్య శ్రీ ప్రత్యంగిరా స్తోత్ర మంత్రస్య మహాదేవ ఋషిః, అనుష్టుప్ ఛందః, ప్రత్యంగిరా దేవతా, హ్రీం బీజం, స్వాహా శక్తిః, స్ఫ్రేం కీలకం, అభీష్ట సిద్ధర్థ్యే వినియోగః

**శ్రీ భైరవ ఉవాచ :**

**దేవీ ప్రత్యంగిరా విద్యా దుష్టగ్రహ వినాశినీ**
**మర్దినీ సర్వ దుష్టానాం సర్వపాప ప్రవిమోచినీ ॥**

**స్త్రీ బాల ప్రభృతీనాంచ జనానాం హితకామ్యయా**
**సౌభాగ్య జననీ దేవీ బల పుష్టికరీ తథా ॥**

**చతుష్పదేషు గోష్ఠేషు తథా గోష్ఠవనే షున**
**శ్మశానే దుర్గమే ఘోరే సంగ్రామే శత్రు సంకటే ॥**

**గుహ్యే ప్యశుచి స్థానేషు సంగ్రామే శత్రుసంకటే**
**రాజద్వారేచ దుర్భిక్షే మహాభయ ఉపస్థితే ॥**

పఠితాస్మారితా దేవీ సర్వసిద్ధి కరస్మృతా
యస్మాత్మస్థా మహావిద్యా ప్రత్యంగిర సుభాషితా ॥

సిద్ధా సుసిద్ధా సానిత్యం విధేయా పరమాస్మృతా
శ్రీ మతాఘోరరూపేణా భాషితా ఘోర రూపిణీ ॥

యస్యాంగస్థా మహావిద్యా విచింత్యా ధారతానరైః
లిఖితాచ కరే కంఠే బాహౌ శిరసి ధారయేత్ ॥

విముచ్యతే మహా ఘోరే మృత్యు రూపే దురాసదే
దుష్ట సర్వ గ్రహాదేవ యక్ష రక్షాదయస్తథా ॥

పీడాం తస్యన కుర్వంతియే చాన్యే పీడకాః గ్రహాః
మంత్రా బాహ్యాభిచారేనో ప్రవర్తంతే కదాచన ॥

నిత్యంచ ధార్యమాణస్య అమృతత్వంచ కల్పతే
సిద్ధార్థా సిద్ధిదా నిత్యం విద్యేయం పరమాస్మృతా॥

ప్రత్యంగిరాక్షరాప్రోక్తా రిపుంహన్యాన్న సంశయః
మంత్రరాజమిదం దేవి సర్వసిద్ధి కరఃస్మృతః
సర్వ విద్యా హరావిద్యా ప్రత్యంగిరా సామహేశ్వరీ ॥

## 8. ప్రత్యంగిరా కవచం

**వినియోగః :**

అస్యశ్రీ ప్రత్యంగిరా కవచమంత్రస్య శిరోఋషిః । విరాట్ ఛందః । పరాశక్తి జగద్ధాత్రీ ప్రత్యంగిరా దేవతా । చతుర్విధ పురుషార్థే వినియోగః ॥

ప్రణవంమే శిరఃపాతు వాగ్భవంచ లలాటకం
హ్రీం పాతు దక్షనేత్రం మే లక్ష్మీర్వామం సురేశ్వరీ ॥

ప్రత్యంగిరా దక్షకర్ణం వామే కామేశ్వరీ తథా
లక్ష్మి ప్రాణం సదాపాతు బంధనం పాతు కేశవః ॥

గౌరీతు రసనాంపాతు కంఠంపాతు మహేశ్వరః
స్కంధ దేశంరతిః పాతు భుజౌతు మకరధ్వజః ॥

శంఖం నిధికరః పాతు వక్షః పద్మనిధిస్తథా
బ్రాహ్మీ మధ్యం సదాపాతు నాభింపాతు మహేశ్వరీ ॥

కౌమారీ పృష్ఠ దేశంతు గుహ్యం రక్షతు వైష్ణవీ
వారాహీచ కటింపాతు చైంద్రీపాతు పద ద్వయం ॥

భార్యాం రక్షతు చాముండా లక్ష్మీ రక్షతు పుత్రకాన్
ఇంద్రః పూర్వే సదాపాతు ఆగ్నేయాం అగ్ని దేవతా ॥

యామ్యే యమః సదాపాతు నైఋత్యా నిఋతిస్తథా
పశ్చిమే వరుణః పాతు వాయువ్యాం వాయు దేవతా ॥

సౌమ్యాం సోమః సదాపాతు చైశాన్యే ఈశ్వరో విభుః
ఊర్ధ్వం ప్రజాపతిః పాతు హ్యధశ్చానంత దేవతా ॥

రాజద్వారే శ్మశానేచ అరణ్యే ప్రాంతరే తథా
జలేస్థలే చాంతరిక్షే శత్రూణాం నివహే తథా ॥

ఏతాభి స్సహితా దేవీ చతుర్భుజా మహేశ్వరీ
ప్రత్యంగిరా మహాశక్తిః సర్వత్ర మాం సదావతు ॥

ఇతి తే కథితం దేవి సారాత్సారం పరాత్పరం
సర్వార్థ సాధనం నామ కవచం పరమాద్భుతం ॥

అస్యాపి పఠనాత్సద్యః కుబేరోపి ధనేశ్వరః
ఇంద్రాద్యాః సకలాదేవాః ధారణాత్పఠనాద్యతః ॥

# II ప్రయోగ ప్రకరణం

## 1. ప్రత్యంగిరా ప్రయోగం A

ఏదైనా నెల అష్టమికి లేదా పుష్యమీ నక్షత్రంలో ఈ సాధన ప్రారంభించాలి. గంగా జలంతో పూజా స్థలాన్నీ శుభ్రం చేయాలి. సాధకుడు శుద్ధుడై ఉత్తర ముఖంగా కూర్చొని ఎదురుగా పీట మీద ఎఱ్ఱని వస్త్రాన్ని కప్పి మధ్యలో రక్తాక్షతల కుప్పపోసి దానిమీద పెద్ద దీపాన్ని నిలిపి అందులో 1. ఆవ నూనె 2. కొబ్బరి నూనె 3. అవిశనూనె 4. వేప నూనె 5. వేరుశనగ నూనె (పల్లినూనె) 6. సూర్యకాంత నూనె (సన్‌ఫ్లవర్) 7. నువ్వుల నూనె 8. ఆముదం కలిపి పోయాలి. అలాగే 8 వత్తులు వేసి వెలిగించాలి. ఈ దీపం అష్టదుర్గా ప్రతీకగా ఉంటుంది. ఇక పీట నాలుగుమూలలో చిన్న చిన్న రక్తాక్షతల కప్పులు పోసి వాటి మీద పచ్చి పోక వక్కలు (బద్దలు కొట్టని గొడ్రటి సుపారీ) నిలపాలి. అవి నలుగురు మహా వీరులకు ప్రతీకలు (వీర, సువీర, అతివీర, మహావీర) వారు సాధనలో సహాయపడతారు. ఇక దీపానికి కుడివైపు (సాధకుడికి ఎడమ) గణపతిని దీపానికి ఎడమవైపు క్షేత్రపాలకుడిని రక్తాక్షతల కప్పుపైన నిలపాలి. అదే పీటమీద సాధకుడికి దీపానికి మధ్య రాగిప్లేటులలో ప్రత్యంగిరా యంత్రాన్ని నిలపాలి. యంత్రాన్ని అష్టోత్తర నామాలు చదువుతూ కుంకుమతో అర్చించాలి. ధూప, దీప, నైవేద్యాలు సమర్పించాలి.



అతివీర



సువీర



శ్రీ ప్రత్యంగిరా



మహావీర



శ్రీ గణపతి



వీర



మహా భైరవుడు (క్షేత్ర పాలకుడు)

**సాధన ప్రయోగం :**

ఇక ధూప దీపాలు, కుంకుమ గంధంతో వెలుగుతున్న దీపాన్ని ఈ క్రింద మంత్రాలతో  అర్చించాలి.

**ఓం నమో భగవతి ప్రత్యంగిరా దీప జ్యోతి త్రికోణ సంస్థే**
**అఖండ జ్యోతి, అఖండ త్రింశత్కోటి దేవతా మాలినీ**
**నిర్మల, అర్ధరాత్రి, నిగమస్తుతే, జ్వాలామాలిని**
**దీపజ్యోతి, సర్వకార్య సిద్ధిం కురు కురు నమః**

**కరన్యాసః :**

ఓం ఐం శ్రీం హ్రీం అంగుష్టాభ్యాం నమః
ఓం ఐం శ్రీం హ్రీం తర్జనీభ్యాసం నమః
ఓం ఐం శ్రీం హ్రీం మధ్య మాభ్యాం నమః
ఓం ఐం శ్రీం హ్రీం అనామికాభ్యాం నమః
ఓం ఐం శ్రీం హ్రీం కనిష్ఠికాభ్యాం నమః
ఓం ఐం శ్రీం హ్రీం కరతల కరపృష్టాభ్యాం నమః

**అంగన్యాసః :**

ఓం ఐం శ్రీం హ్రీం హృదయాయ నమః
ఓం ఐం శ్రీం హ్రీం శిరసే స్వాహా
ఓం ఐం శ్రీం హ్రీం శిఖాయై వషట్
ఓం ఐం శ్రీం హ్రీం నేత్రత్రయాయ వౌషట్
ఓం ఐం శ్రీం హ్రీం అస్త్రాయ ఫట్
భూర్భువ స్సువరోమితి దిగ్బంధః

ఈ న్యాసాలు చేసిన తరువాత క్రింది మంత్రం చదువుతూ ఎఱ్ఱగులాబీలతో లేదా గులాబీ రెక్కలతో 21 సార్లు ప్రత్యంగిరా యంత్రాన్ని అర్చించండి.

**మంత్రం :**

**"ఓం నమో ప్రత్యంగిరా సర్వకామనా సిద్ధిం హ్రాం హ్రీం నమః"**

ఇక గురు యంత్రాన్ని చిత్రాన్ని అర్చించి, ప్రత్యంగిరా సిద్ధినియాచించి 5మాలలు గురు మంత్ర జపంచేసి, (గురుమంత్రం - **ఓం పరమ తత్వాయ నిఖిలేశ్వరాయ గురుభ్యోన్నమః**) దీపంలో మీకు ఎదురుగా ఉన్న దీప శిఖను

త్రాటకం చేస్తూ, అన్నీ ఇంద్రియాలు, మనస్సును, బుద్ధిని ఏకాగ్రం చేస్తూ క్రింది మంత్రాన్ని 51 సార్లు ఉచ్ఛరించండి.

**ఓం హ్రీం హ్రూం హ్రః హ్రీం ప్రత్యంగిరాయై నమః కృష్ణవాసనే**
**సహస్ర లక్ష కోటి సింహవాసనే ఫ్రేం సహస్రవదనే మహాబలే**
**అష్టాదశ భుజే హ్రః అపరాజితే హ్రైం పరసైన్య కర్మవిధ్వంసినీ**
**హంసః పర మంత్రఛేదిని సర్వశత్రూచ్చాటినీ సర్వభూతదమనీ**
**ఠః ఠః సర్వదేవాన్ బంధ బంధ హుంఫట్ సర్వ విఘ్నాని ఛింది ఛింది**
**సర్వానర్థాన్ నికృంతయ - నికృంతయ సర్వదుష్టాన్ భక్షయ భక్షయ**
**ఫ్రేం జ్వాలా జిహ్వే హ్రీం కరాలవక్త్రే హంసః పరయంత్రాణి స్ఫోటయ**
**సర్వశృంఖలాన్ త్రోటయ-త్రోటయ అసురముద్రాం ద్రావయ ద్రావయ**
**ఉం రౌద్ర మూర్తయే హ్రీం ప్రత్యంగిరే మహా విద్యా! మమ తంత్రార్థం**
**కురు - కురు నమోస్తుతే హ్రీం హ్రః హ్రూం హ్రీం ఓం నమః ॥**

ఈ సాధన చేసిన తరువాత కూడా శత్రు బాధ తొలగ లేదనుకోండి, లేదా మీ శత్రువు మహాశక్తి మంతుడై పేట్రేగి పోతున్నాడనుకోండి అప్పుడు తరువాత ఇవ్వబడిన కవచాన్ని (త్రైలోక్య విజయ ప్రత్యంగిరా కవచం) జపిస్తూ యజ్ఞ గుండంలో ఆహుతులు ఇవ్వాలి. (ఆహుతులు ఆవనూనెతో ఇవ్వాలి) ఎవరికైనా భూతప్రేత బాధ కలిగినప్పుడు రాగి చెంబులో నీళ్ళు తీసుకొని ఒకసారి ఈ కవచం ఉచ్ఛరించి వారిమీద నీళ్ళు చిలకరిస్తే వెంటనే ఉపద్రవం శాంతిస్తుంది. ఎవరికైనా వశం చేసుకో దలచుకుంటే ఈ కవచాన్ని 11 సార్లు పారాయణం చేయాలి. ప్రతి పారాయణం తరువాత ఒకసారి ఆవ్యక్తి నామాన్ని ఉచ్ఛరించాలి. నల్ల నువ్వులతో క్రింది మంత్రాన్ని ఆహుతి ఇవ్వడం వల్లకూడా వశీకరణం సాధ్యం అవుతుంది.

**"ఐం క్లీం హంసౌం ప్రత్యంగిరా మమ వశ్యం కురు - కురు హ్రీం సర్వౌషట్ స్వాహా"** ఒకేసారి ఈ వశీకరణం సాధ్యం కాకపోతే 2-3 సార్లు ఈ ప్రయోగం చేయవచ్చును.

ఈ సాధన యొక్క సిద్ధి సంపూర్ణంగా పొందదలుస్తే, రోజు నియమం ప్రకారం మూల మంత్రం నల్లని హాకీక్ మాలతో జపించాలి. ఈ ప్రయోగం కొరకు వాడిన మాల ఇతర ప్రయోగాలలో వాడడానికి వీలులేదు. మూల మంత్రం ఇవ్వబడుతోంది.

